# సుబ్బరాయశతకము

## [నీతిగీతములు]

ఆశుకవి చక్రవర్తులు

కొప్పరపు సోదరకవులు

శతావధానులు

# సుబ్బరాయశతకము

## [నీతిగీతములు]

గ్రంథకర్తలు :

బాలసరస్వతి, ఆశుకవీంద్రసింహ, ఆశుకవిచక్రవర్తి, అవధాని
పంచానన, కుండినకవిహంస, కల్పితకథారచనా
ధురీణ, కవిభూషణ, ప్రౌఢభారతీత్యాద్యనేక
బిరుదాంకితు లగు

కొప్పరపు సోదరకవులు

శతావధానులు

# ముద్రణద్రవిణాపకులు



శ్రీకన్యకాకృపాశ్రీబలయుక్తుఁడు
నయవాగ్విభూషి కాంతయమనీషి
దాతృతాన్వితుండు తద్జ్ఞనుతుఁడు సీ
తారామనామ్ముఁ డుత్తమభవ్యుఁడు
పత్రికట 'బి. ఏ.' పదపట్టభద్రుండు వేం
కటరెడ్డి సుకవితాకౌతుకుఁడు
శిష్టమార్గరతుఁ డదృష్టరేఖాయుతుం
డప్పతిగంభీరుఁ డప్పరావు
శిక్షాధికారి పౌరక్షేమకారి పా
జ్ఞాంగీకృతోక్తుఁడు రంగరాయి

వీర లేపురు చుంచుమాంకవారు నాగ
భూషణాఖ్యకుమారులు పుష్పితసుకవి
విబుధవారులు రామాఖ్యవిహితనుతులు
స్థిరయశస్సంపదలఁ బ్రకాశింత్రుగాత.

# సాలంకృత కన్యాదాన

## అర్పణము

సీ. శ్రీమన్నగాత్మజాప్రేమమయార్ధదే
హంబువాఁ డుక్షవాహంబువాఁడు
హరివిరించనసురేశార్చ్యసుమాంఘ్రిప
ద్మంబువాఁ డద్రిసద్మంబువాఁడు
భక్తసంత్రాణాభియుక్తతాసక్తచి
త్తంబువాఁ డలఘువృత్తంబువాఁడు
పరపురాశరపురోత్కరజయోద్ధురహరి
శరమువాఁ డహిరాజసరమువాఁడు
వీరభద్రాదికకుమారవీరవిసర
గురుతరానందభరుఁడు శంకరుఁడు కరుణ
మత్కృతికుమారికామాన్య మహితకీర్తి
విభవసంతానధన్యఁ గావించుఁగాత.

సీ. ఏ సవిత్రి పవిత్రదాసహృచ్ఛతపత్రి
సంచరచ్చంచరీకాంచితాత్మ
ఏ ప్రసు వా ప్రసూనేషుపంచేషు పా
తాసాధ్యసుధ్యుత్సవానుకూల
ఏ జనయిత్రి విభ్రాజదోంకారనా
దబ్రహ్మమునకు నిదానసీమ

ఏ మాతృమణి సుధాధామార్ధబింబ క
ల్పితకలాపప్రభాసితశిరస్క
ఆనిజాశ్రితజాతకల్పాగకల్ప
ఆ జగన్నేత్రి శాంకరి యఖిలదాత్రి
శిష్టరక్షణకార్యప్రక్లృప్తచిత్త
మత్కృతీశ్వరు నిష్టాప్తి మనుచుఁగాత.
సీ. లాలించె లబ్ధాసుజాలబాలకపాళి
నర్పించి గురుదేవు సమలభావు
తేలించె సుగుణాలవాలు నాప్తుఁ గుచేలు
సమర్థకైశ్వర్యాబ్ధిసాంద్రఁజేచి
పాలించె నక్షయపటదానసంపత్తిఁ
బతిదేవతామణిబాంఛమహిమ
ఏలించె ధర్మజు నేకోష్ణవారణ
క్రమ మొప్పఁ బ్రాజ్యసామ్రాజ్యలక్ష్మి
అతఁడు లీలానరావతారైకకీర్తి
సంతతాశ్రితపోషణానంతమూర్తి
కృష్ణుఁ డోమెడుఁగాత మత్కృతికుమారి
కాభిమతచర్య సుబ్బరాయార్యవర్య.
సీ. శ్రీవత్సలాంఛనశ్రీవత్సు ననపాయి
నీత్వంబుఁ గైకొన్న నిరుపమాంగి
రత్నాకరస్వామి నూత్నసంతోషవీ
చీడోలికల నూగు చెలువమిన్న

కరుణారసతరంగకమనీయదృగపాంగ
పాళి భక్తులలేమిఁ ద్రోలువేల్పు
జగదేకచిత్రప్రశస్తపీఠకుమారు
మారుఁ బుత్త్రుఁగఁ గన్న పీరమాః
తల్లితల్లి జగంబులతల్లి పాల
వెల్లిఁ బొడమిన సత్కృపావల్లి యుల్ల
ముల్లసిల నిల్చుతను ప్రేమ పెల్లుకొనఁగ
మత్కృతీశ్వరు సత్సౌఖమందిరముల.

సీ. కుభరకన్యాంశంబు కొమరారఁ గొమిరె మై
కుసుమార్యునకు యశం బొసఁగుదేవి
ఇలువేల్పుగాఁ గొల్చు నేకోత్తరశతాంక
గోత్రవైశ్యుల నేలికొనెడుదేవి
నగరమువా రన్న మిగులైననామంబు
నార్యవైశ్యుల కిచ్చినట్టిదేవి
ఐదంయుగీసరమాదేవి నా నధి
కైశ్వర్యసంపత్తి నలరుదేవి
తనముభక్తుల కెంమ నింతయుఁ గొఱంత
గలుగనీకుండ వేయికన్నులను జూచు
కన్యకాపరమేశ్వరీ ధన్యనామ
మత్కృతిస్వామి నిష్టాప్తి మనుచుఁగాత.

* *
*

* *
*

సీ. నరసరాట్పురవరమాతరుణీలలామంబు
కనికరంబునఁ బెంచు ధనికవరుఁడు
వత్సరత్రయిఁ బురపాలకోపాధ్యక్ష
తను నిర్వహించిన తంత్రవిదుఁడు
వస్తుమర్మంబులు వాణిజ్యమర్మముల్
నెఱి నెఱింగి చరించు నేర్పుకాఁడు
సరస్వతంత్రుఁడై సమయానుగుణవాక్య
కార్యచాతుర్యుఁడౌ ధైర్యరాశి
కాశికాముఖతీర్థయాత్రాశతైక
దర్శనాగతపుణ్యసంతానతనుఁడు
నాగసరవంశపద్మకాంతారహేళి
యలఘుగుణపాళి సుబ్బరాయార్యమౌళి.

సీ. గణ్యపదాఢ్యుఁ డంకారావు గోస్గంట్ల
కులుఁ డాప్తమణి గాఁగ వెలయువాఁడు
ధనికులయందు నుత్తముఁ డౌచు నిర్గర్వ
వినయవంతుం డనఁ దనరువాఁడు
పౌర్వికాచారసంపన్నుఁడై నాగర
కోత్తమఖ్యాతిమై నొప్పువాఁడు
బాల్యకాలంబాది పటుబుద్ధిసంపత్తి
భట్టి నెట్టనఁ బోలునట్టివాఁడు

వేడుకంగాని కొండికనాఁడుగాని
సరసవేళలఁగాని యేసరణిఁగాని
కూఁడు నసఁబడు వాక్యంబె యాఁడువాఁడు
నాగసరసుబ్బరాయండు నయవిధుండు.

గోనుగుంట్లాన్వయ గోపాలకృష్ణార్య
కుల ముద్ధరింపఁ బేర్గాంచినసాధ్వి
నాగసరాన్వయోత్కృతకీర్తిలకుటుంబ
లత విశాల్ ప్రాకించు నుతగుణాఢ్య
వాసవీకన్యకాభాసురపదపద్మ
సేవాఫల మెఱుంగు పావనాత్మ
పతిదేవతాధర్మపాలన యువకార్య
నైశ్వర్యయోపస్తుతి వెలలుధన్య
బాంధవార్తిజనవారితసింధుజాత
వృషవిఖ్యాత, సత్కీర్తిస్తుత్యపేత, సుగుణ
జాత, వేంకటసుబ్బమాంబపూత
యలరు శ్రీసుబ్బరాయని యర్ధదేహ.

సీ. కనుసన్ననే మనోగతభావము లెఱింగి
పతికి మోదముఁ గూర్చు చతురబుద్ధి
తనవారు ధవునివా రనుభేద మెఱుఁగనీ
యక బంధుగుల మెచ్చు లందు సుగుణ

కఠినవాక్యంబును గలుషవాక్యంబును
గలనైనఁ బలుకని యలఘుశీల
ఐశ్వర్యగర్వ మావంతైన నింతైనఁ
జూపఁగాఁ బూనని శుద్ధచరిత
చింతయును నుబ్బుగొనని ప్రశాంతహృదయ
సుబ్బరాయనిగృహలక్ష్మి శుభవిలాస
సుగుణనికురుంబ వేంకటసుబ్బమాంబ
కన్యకాకృప సత్పుత్రికలిత యగుత.

చం. కలిగినయింటిబిడ్డ నని, కల్గినవానికి రాణి నంచు, నా
కలిమికిఁ గల్మిచేడియ యొకర్తుగదా సమ యంచు, నెవ్వరిం
జులుకనచూపునం గన దసూయకుఁ జిక్కక ప్రక్క కెన్నడుం
గలకలలాడు నెమ్మొగమునం బతికిన్ హితవైఖరిం దగున్.

చం. గతభవసత్తపఃఫలము గావలెఁ బున్నయసుబ్బరాయఁ డీ
సతి కని విన్నకొండపురసాధ్వులు పల్కఁగ, నర్సరాట్పురీ
గతపతిదేవతామణులు కావలెఁ బున్నయ్యపుత్రి ప్రాక్తన
వ్రతఫల మీపురంధ్రి యని పల్కుదు రేమన వారివృత్తముల్.

మ. సమవిద్యాధనగౌరవోన్నతులఁ బ్రాశస్త్యంబుఁ గైకొన్న యు
త్తమవంశంబులఁ బోల్చి వీరిరువురుద్వాహోత్సవం బందు వే
ళ మనీషావరభూషులౌ బుధమణుల్ వాక్రుచ్చి రొక్కుమ్మడిన్
'సమయో రేవ' యటన్న శ్లోకగతమౌ సత్యార్థమత్యాదృతిన్.

గీ. వీరిదాంపత్యధర్మంబు, వీరివినయ
నయగుణోదయసద్వర్తనంబు, వీరి
దేవభూసురభక్తి శ్రితావనసత్వ
రక్తి విబుధజనైకప్రసక్తి కెక్కె.

గీ. యౌవనబలంబు ధనబలం బన్వయబల
మెంచు మదకారణంబు లౌ, నివియుఁ బ్రమద
కారణంబులుగా నుండె, వీరిఁ గన్న
యోగ్యులపురాకృతోరుపుణ్యోదయమున.

గీ. సుగుణనికురుంబ వేంకటసుబ్బమాంబ
గేహినిగ నొప్పు సుఖపరీవాహకేళిఁ
దనిసి, నవనవయౌవనోదయమునాఁడె
గేయగుణరాశి యగు సుబ్బరాయగుప్త.

కం. వినుచుండు శ్రుతిస్మృతులను
గనుచుండుఁ దదుక్తధర్మకర్మజ్ఞుల ర
మ్మనుచుండు యశోరమలం
గొనుచుం డాశీస్సు విబుధకోటి యొసంగన్.

గీ. అనుఁగుసోదరి పున్నమయును దదీయ
సంతతియు సంతస మొసంగ సంతతంబు
సర్వశక్తిసమేతుఁడై యుర్వరేంద్ర
పౌరగౌరవసత్కారపాత్రుఁ డయ్యె.

గీ. బంధువులు మిత్రులును సుకవిసింధు లార్య
కవిబుధేంద్రు లిట్టి ధనకోత్సవసమృద్ధి
వెలయ దీవింపఁ గన్యకావిపులకరుణ
నాతఁ డొప్పెంచు సర్వాన్వయార్యముండు.

ఉ. నాగసరంబు వల్మికమునం బడియుండినభోగిపూగముల్
లాగినలీల దోఁప శుభలక్షణలక్షితుఁ డకుమారకుం
డేఁగి మదీయముష్కృతము లీఁగలఁ డాసుకృతంబు లంచుఁ ద
న్నాగసరాన్వయోద్భవు లనారతముల్ దలఁపోతు
రాత్మలన్.

మ. అతిబాల్యంబగునాఁడె యన్నగరివా రర్యాన్వయప్రోద్భవుల్
మతివాచస్పతి యీతఁడంచుఁ గులధర్మప్రశ్నలుం దర్కసం
గతులున్ గోష్ఠి వచించి వానిమతిపోకం బోవువా రన్నచో
విత్తైశ్వర్యుఁ డశేషవేముసి యనన్ బిలెట్లు కాకుండెడిన్.

గీ. తండ్రిఁ దాతను ముత్తాతఁ దాతతాత
సర్వవిధముల మీఱఁగాఁ జాలె నితఁడు
సదృశు లెందఱో కల్గ నీసరికి సనెడు
పేరు గణియించె నయసింత చేరునాఁడె.

మ. అల కాశీముఖపుణ్యపట్టణచయం బావారణాస్యాదికో
జ్జ్వలపుణ్యాకరతీర్థరాజము లతిశ్రద్ధన్ విలోకించి ని
ర్మలభక్తిం బితృవారముం దనిపె సంభావించె దత్రత్యులన్
దళితాఘుం డుపదానతర్పితబుధేంద్రశ్లాఘుఁ డాతం డొగిన్.

సీ. సాధుసంచయహితస్వాంతుండు శ్వశురవ
రిష్ఠుండు గోపాలకృష్ణసుగుణి
అగ్రజాజ్ఞాపాలనాబద్ధబుద్ధి రా
మయనామధేయుండు నయవిదుండు
ఆదినారాయణపాదార్చనరిరంసుఁ
డాదినారాయణాఖ్యార్యమౌళి
పరీక్షాధురీణుండు ప్రాభవోపేతుఁ డం
కా రాపునామవిఖ్యాతమూర్తి
రామలక్ష్మణసమాఖ్యామానితుండు ని
త్యానందధాని విద్యాభిమాని
సరసుండు సద్గుణసాంద్రుఁ డతంద్రుండు
రహితాప్తనిచయార్తి రామమూర్తి

విన్నకొండపురీవైశ్యవీరవరులు
గోనుగుంట్లాన్వయులు తన కూర్మిబంధు
లిద్ధగుణసింధు లెన్న నహీనవిభవ
శాలులై సుబ్బరాయుఁ డెసంగుచుండె.

క. హరి సరి శౌర్యంబున సుర
గిరి సరి ధైర్యంబునం బ్రకృష్టవిభూతిన్
గరిసరి సరి సిరి సరి సిరి
యరశే యువ్వాని కనఁగ నతఁడు చెలంగున్

గీ. అర్యవంశాబ్జమిత్రుఁడౌ ననఘుఁ డాతఁ
డస్మదత్యంతమిత్రుఁడై యలరుకతన
శాశ్వతచరిత్రుఁడై జగజ్జాలవినుతి
పాత్రుఁ డగు టొప్పు సుయశఃపవిత్రుఁ డగుచు.

క. ఏ కృతి నది సాధ్యంబగు
నాకృతి నొనరించి దశదిశావృతకీర్తి
స్వీకృతి నధమర్ణత్వని
రాకృతిఁ గొనవలయు నంచు యత్నించునెడన్.

క. అలసాని పెద్దనార్యుం
డలఘుకవిత్వాబ్ధి గువ్వలాన్వయ సుగుణో
జ్జ్వలుఁ జెన్నయార్యమణి, ని
స్తులుఁ జేసినకథ మనఃప్రతోషిం దోఁపన్.

క. కృతిముఖమున నివ్వానిచ
రితము స్థిరత్వంబుఁ జెందురీతిగ నేయే
కృతులఁ బొసంగమి నిక్కము
లు దానఁ గల్గు కీ లెఱుఁగ రౌరా.

చ. కృతులఁ బరిగ్రహించుటకుఁ గేశవరుద్రులయంతవారె యు
ద్ధతి దిగద్రావి సత్కవివతంసములన్ వెసఁ గోరి రంచు భా
రతముఖదివ్యకావ్యముల వ్రాసిరి తిక్కనముఖ్యు లన్నచోఁ
గృతి యతిలోకమానిత మభీష్టద మంచు వచింపనేటికిన్.

క. కృతహస్తత్వము తగ నీ
కృతలక్షణచరిత నీతికృతిముఖమున సు
స్థితిఁ గనఁగఁ జేతుము పురా
కృతపుణ్యఫలంబు వీనికిం దోడ్పడఁగన్.

క. కృతికన్న మానవుని శా
శ్వతచరితునిఁ జేయఁజాలు సత్కార్యం బి
క్షితిఁ గల్గమిఁ గాదే సం
తతి యుండినగాని కృతి గోరఁ బ్రియపడుటల్.

క. నీతిపథోపాధ్యాయకు
నీతరుణీమణికి నితఁ డనీశ్వరపదవి
స్ఫీతుం డగుటనె భువన
ఖ్యాతయశశ్శోభి యగుటగాఁ దలఁపఁదగున్.

గీ. కావ్యములకన్న మఱి నాటకములకన్న
శతకముల కెక్కు డుండుఁ బ్రచార, మెల్ల
బాలురును స్త్రీలుఁ బామరుల్ పండితులును
నిచ్చలుఁ బఠించి నేర్వ నా నీతి యుంట.

గీ. సుమతిపేరును వేమనసూరిపేరు
గువలచెన్నయపేరుఁ బెక్కురు వచింత్రు
శతకపద్యంబులఁ దురీయచరణమునందు
వారి నామంబు గల్గిన కారణమున,

గీ. సుతుని పేర్నిర్ణయింపఁ దల్పితను వ్రాఁతు
రందలిరహస్య మెంచియు నాద మెంచి
సుమతు లౌనన 'పున్నయసుబ్బరాయ'
యనుచు శతకంబునను బల్కనయ్యె మాకు.

క. అలివేలమ్మకుమారకుఁ
డలఘుయశోవార్ధి కాంచు నాత్మజుఁ గవితా
లలితాంగి మేలు మేలన
కులపాలికయందు నిందుకోటీరుదయన్.

సీ. చందురుం డమృతంబు నొందాక భరియించు
నందాక సత్కీర్తి నందుమయ్య
మందరంబున స్థైర్య మొందాకఁ జన్నొందు
నందాక సత్కీర్తి నంగుమయ్య
మందారమునఁ దావు లెందాకఁ జెలువందు
నందాక సత్కీర్తి నందుమయ్య
క్రొందామరల నింది యెందాక వసియించు
నందాక సత్కీర్తి నందుమయ్య

గీ. సర్వవస్తులుఁ గాలదోషమున భిన్న
గతులు గాంచినఁ గాంచునుగాక సుకవి
కల్పితయశంబు భిన్నతఁ గనదు కనదు
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ.



శ్రీమత్సనకసుగ్రాంబాయై నమః

# సుబ్బరాయ శతకము

## సీతి గీతములు

### దేవతాస్తుతి

గీ. శ్రీకరుల భక్తచిత్తవశీకరుల శు
భాకరులఁ బాపశోకదవాగ్నికరులఁ ద్రి
లోకపతుల భజింతు సుశ్లోకగతుల
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౧

గీ. వాణి వినమితసత్కవిశ్రేణి స్ఫటిక
హారపుస్తకవల్లకీ కీరపాణిఁ
దలఁతు వేదాంతవేణి విధాతృరాణి
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౨

గీ. సిరులప్రోయాలు కటివేల్పు మురియునాలు
చెడుగునిప్పచ్చరపుఁదీవ నడఁచువాలు
వేలుపులజాలుచూలు కావించు మేలు
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. 3

# సుబ్బరాయశతకము.

గీ. కాళి సద్భక్తహృదయాబ్జహేళి విమత
గర్వపర్వతదంభోళిఁ గలితవిజయ
కార్యరింఛోళిఁ దెలుతు నుతార్యపాళి,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ.

గీ. అగ్రపూజాతిపాత్రు, సమ్యక్చరిత్రు
దైన్యవల్లీలవిత్రు ధీమాన్యగాత్రు
శైలదౌహిత్రు నెంతు యశఃపవిత్రు
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ

గీ. బద్దెనరపతి వేమన భర్తృహరిని
సూరనను ధూర్జటిని బుధవీరవినుత
నీతిశతకకవీంద్రుల నెఱి స్మరింతు,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ.

# నీతిగీతములు.

## దాతృత్వము

గీ. హారకేయూరకటకాదిచారుభూరి
మణిమయవిభూషణంబు లే మానవునకుఁ
జాగముం బోలెఁ గీర్తి నొసంగ లేవు,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౧

గీ. స్వార్థపరతను వీడి పరార్థపరతఁ
బ్రాణమేని యొసంగు నే భవ్యశీలి
దానశాలి వదాన్యమాన్యుండె ఘనుఁడు,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౨

గీ. వక్రమతి శుక్రుఁ డీట్లీయ వలద న్న
వామనస్వామి కర్థి సర్వస్వ మిడుట
బలినిఁ బలికిరి దాతృతాబలిగ ఋషులు;
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. 3

గీ. భీతి 'మాం రక్ష' యనిన కపోతవిభుని
కొఱకు తన మేనికండను గోసియిచ్చి
శ్యేనముం దన్పు శిబిఁ బోలఁ బూను నెవఁడు;
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౪

## సుబ్బరాయశతకము.

గీ. ప్రాణభయమున సర్పడింభకుఁడు వేఁగల
వానికై దేహము నొసంగి వైనతేయుఁ
దనుపు జీమూతవాహను నెనయు నెవఁడు?
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౫

గీ. అర్థి నరుమాత్రనే దేవతాధిపతికి
వెన్నెముక నిచ్చి ప్రాణంబు విడిచి దాన
వీరుఁడైన దధీచి కెవ్వార లీడు?
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౬

గీ. చక్రవర్తులు నన్యు లైశ్వర్యవంతు
లెందఱుంగాని యొక్కింత యిలను నేలు
కర్ణుయశ మందిరే దానకలనఁ జేసి?
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ ౭

గీ. ద్వాపరమునుండి యీనేఁటిదాఁక దాన
పరతఁ దగువాని నభినవపదముఁ గూర్చి
కర్ణునిగఁ బల్కుచుంటఁ దద్ఘనత యసదె!
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౮

గీ. పరిణయాగతుఁ డయి నిజపరిణయార్థాం
కన్య, వేఁబోకఁ దర్శింపఁ గడఁక నిడిన
చాగి రాయనిభాస్కరుసాటి గలఁడె?
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౯

# నీతిగీతములు.

గీ. కనకులకష్టము లెఱింగి కాల మెఱిఁగి
కురిసి పండించి ధాత్రి నుర్వరఁగఁ జేయు
కతనఁ బర్జన్యునకుఁ గల్గె ఘనపదంబు,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౧౦

గీ. గుహలఁ గొలనుల వల్లీనికుంజములను
ఫలములం బత్రముల మధువులను దనుపు
నాశ్రితావళిఁ బెనుదాత యద్రినేత
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౧౧

గీ. తనకుఁ గలయది యర్థికిఁ దనియ నొసఁగ
దాతృశబ్దార్హుఁడౌ, లఘుతాగురుత్వ
భేద నిర్ణయముం జేయరాదు క్రియల,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౧౨

గీ. కమల కహ్లార కైరవ కుముదకుసుమ
పరిమళరజోమరందశీకరము లొసఁగి
యధ్వగుల నశ్రములఁ జేయు ననిలదాత,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౧౩

గీ. సరసఫలసంచయంబులఁ జలువనీడ
లను నొసంగి ద్విజోక్తులఁ దనిపి పత్ర
వీజనంబుల సుఖ మిచ్చు వృక్షదాత,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౧౪

# సుబ్బరాయశతకము.

గీ. దాన మీకుంటఁ బోలి దరిద్రత ఘటిల్లు
నదియ పాపకృతిఁ జేయించు నద్ది పాత
కంబుఁ జేర్పించు నది నరకంబుఁ గూర్చు
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౧౪

గీ. గతభవంబున దాన సాహా కతనఁ గలిమి
వెలయు, నయ్యది సత్కృతి సలుపఁ జేయు,
నదియ పుణ్యంబు నిడు, స్వర్గ మది యొసంగు,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౧౫

గీ. యతులశ్రాద్ధంబు నుదయకాలాంబుదంబు
నాల్మగలసంగరంబు మేషాహవంబు
దివిరి యారంభశూరతఁ దేలి యడఁగు
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౧౬

## దుష్టుఁడు

గీ. దుష్టునిస్స్వభావ మది హితోక్తుల మఱలదు
గాంగశతకుంభజలమున క్షాళితంబు
సేయ నంగారనైల్యంబు మాయమగునె?
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౧౭

గీ. సంవత్సరం దిరుగాడేమనాఁడైనఁ
పెద్దతన మది మాఱని చెనటిబుద్ధి
మాఱుఁ గానలఁ బుడకల జేరునాఁడె;
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౧౯

గీ. ఫణిఖలులయందు దుష్టుఁ డెప్పటికి ఖలుఁడె;
మంత్రమహిమనో యౌషధమహిమమునసో
వశ్య మగు ఫణి; ఖలుఁ డెట్టి భంగిఁ గాఁడు,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౨౦

గీ. బాహ్యవేషంబులంబట్టి, భావ మెల్ల
మొనయు దుష్టుని కనరాదు; ముసిడిపండు
కనఁగ నెఱుపగు విషమున కన్న విషము;
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౨౧

గీ. దుష్టసంసక్తి మార్పంది శిష్టుఁ డొకట
శిష్టసంసక్తిఁ దొలిగతిఁ జెందు, బురద
నీరు తాఁ జిల్లగింజను మాఱుకరణి;
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౨౨

గీ. చెడుగు మార్పందఁ డేమంచి చేతనైనఁ;
గప్పురము పాదు, పూఁత మే ల్కస్తురియును,
నీరు పన్నీరయిన నుల్లి మాఱఁగలదె!
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౨౩

గీ. కుక్క కందలమును, బండుకోతి కద్ద,
మల్లునకు రాజ్య, మాగన కర్థ, మన్ష్య
కునకుఁ గాకిత మిడ మేలు గూడఁగలదె?
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౨౪

గీ. అమితలోభంబు, నమితకామమును, నమిత
వైభవముఁ జెంది, కౌరవవల్లభుండు
రావణుండును, నహుషుండు † రాటుగొనరె,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౨౫

గీ. వర్జనీయంబ యనిరి సర్వత్ర; వేఁటఁ
బాండునరపతియుఁ, ధర్మజుండు ద్యూత
కలనఁ, బానంబునను యాదవులును జెడరె;
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౨౬

గీ. జీవికయు ధనకరంబైన సేవకతను
గణ్య మందురె? శృంఖల కనకమయము
వరమణిస్థాపితంబైన గురుతఁ గొనునె?
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౨౭

గీ. తాను భుజియించు నురగసంతతిని, దాసుఁ
డగుచు మోసెను మాతృదాస్యంబుఁ జేసి
వైనతేయుఁడు; వింటె సేవాఫలంబు!
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౨౮

† రాటు = ఉపద్రవము

గీ. ఎఱుఁగనిప్రవాహమున దిగు, టరయఁబోని
దాన వాదించుటయుఁ, దన దార్ఢ్యమునకు
మించిబరువు పూనుటయుఁ బుట్టి ముంచుకొనుటలు ;
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౨౯

గీ. వెన్నెల, వయస్సు, నైశ్వర్యము న్నిలువక
భ్రాంతి గలిగించి యుఱికిపోవు భావరథముఁ,
ప్రాజ్ఞుఁ డెఱిఁగి చరింప నాపదలు రావు ;
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౩౦

గీ. బహుమనుజనాయకత్వంబు బాలనాయ
కత్వముం గామినీనాయకత్వముఁ బరు
నాయకత్వముఁ బలె సర్వనాశ మిచ్చు ;
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౩౧

గీ. నాయకవిహీనకార్యమే నాఁడు నెగ్గ,
దథమనాయకుఁ డుండని యట్లగాక
యన్యథాకారి యగు, నష్ట మరయు టొప్పు ;
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౩౨

గీ. లేనినాఁ డతిశాంతుని లీల నుండు
వాఁడు గణనీయుఁడా? యున్ననాఁడు శాంతి
సంపద నెసంగ గణనీయజనుఁడు గాక !
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౩౩

గీ. గోచికై పిల్లిఁ, బిల్లికై గోవు, దాని
కొఱకు నేవేవియో కోరి కొసకుఁ దపము
మానవలసిన తపసిని మఱువరాదు;
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౩౪

గీ. ముఖ్యము నముఖ్య మెఱుఁగక మూఢజనుఁడు
కార్యలాపటుఁడై వ్యర్థకార్యుఁ డగును;
ఆతఁ డాదర్శకుండు జడాత్మకులకు;
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౩౫

గీ. కష్టనిష్ఠురతల కోర్చి కాంచికొన్న
ధనము, నాలును, బిడ్డ లుత్క్రమణవేళ
రాదు తనప్రక్క నొక్క ధర్మంబుదక్క,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౩౬

గీ. నరుని దాసునిగాఁ గొని దురితకృత్య
ములను జేయించి ధన మతిబలముఁ గూర్చి
పాతకుం జేయు నపకీర్త్యుపేతుఁ జేయు,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౩౭

గీ. తతసురాశాపిశాచ మే యతనిఁ జేరు
నతని కాప్తులు, బంధులు, సుతులు, సతులు
పసులుగాఁ దోఁచెదరు, మతిస్థిరత చెదరు,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౩౮

గీ. గోవుకడ మద్యమును, దాళకుజము చెంతఁ
బాలుఁ గ్రోలఁ దదన్యమా భంగి, జనులు
పలుకు రెన్నఁగ సంబంధఫలము సూవె,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౩౯

గీ. ఉత్తమాధమసాంగత్య మొదవఁజేయుఁ
దత్తదనురూపఫలము; లుదకము, శుక్తి
తప్తలోహంబులం బడి తనరుభాతి;
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౪౦

## ప్రభుధర్మము

గీ. సామమున్ దానమున్ భేదసరణి నడపి
యవల దండనముం జూపు టగును కార్య
గతికిఁ, దొలి దండనమె చూప గండ మబ్బు;
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౪౧

గీ. ఎంత యధికార ముండునో యంతశాంత
మున్నచో, వానిఁ గన జను లుత్సహింత్రు,
చల్లగాలిఁ బయోదం బెసంగినట్లు,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౪౨

గీ. అధికృతి యశాంతికంబైన నతనియునికి
దుస్సహం బౌటఁ బోక నొంతురు జనములు
గాలి నుండించు నైదాఘవేళవోలె,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౪౩

గీ. కరుణ, కోపంబు, లక్ష్యంబు, గౌరవంబు,
దార్ఢ్యము, ప్రసన్నభావంబుఁ దత్తదవస
రార్హపద్ధతులం గొన నగు ప్రభుండు,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౪౪

గీ. పేద ధనికుని భీరుని వీరు విమతు
స్వమతుఁ గుటిలుని నకుటిలు శత్రు మిత్రు
స్థలమును బలంబు నెఱుఁగఁగావలయు నృపుఁడు;
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ ౪౫

గీ. ధర్మహితవాది, శాత్రవమర్మభేది,
స్వామికార్యహితస్వాంతు, శౌర్యవంతు,
సచివమణిఁ గైకొనందగు జనవరుండు;
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౪౬

గీ. ధైర్యయుతు † నుపధాశుద్ధు దాంతు శాంతుఁ
గార్యకరణప్రవీణు ధీధుర్యుఁ జతుర
వాక్కును సుమంత్రిగాఁ గొనవలె విభుండు;
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౪౭

ధర్మార్థకామములవలన బరీక్షితుడై శుద్ధు డయినవాడు.

గీ. సైన్యమును, నశ్వమును, మంత్రి జనము, ద్రవ్య
కోశ, మాయుధకోశంబు, ఘోటకేభ
బలము, భద్రంబుగాఁ జూడవలయు విభుఁడు;
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౪౮

గీ. కరముఁ గొనువేళ స్వప్రజఁ గష్టపఱుపఁ
జనదు, విడువఁగవలవదు, సమయ మెఱిఁగి
యుచితసున్యాయమునఁ గొన నగు విభుండు,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౪౯

గీ. ధనము, విద్యయు, బలము నుత్తములచెంత
నొరుల కుపకారకంబు లై యొప్పు; నధము
చెంత నపకారకంబులై చేటుఁ దెచ్చు,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౫౦

గీ. పురుషుని ప్రయోజకత్వంబు కరముఁ బట్టు
పొలఁతుక యదృష్టముంబట్టి ఫలము నొసఁగు,
మెఱపునుంబట్టి మేఘంబు కురియుకరణి;
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౫౧

గీ. గొడ్డు బిడ్డయు నాల్మొగల్ గూడినపుడె
భవన మొప్పెందు; శాఖలుఁ బత్రములును
గాయలు ఫలంబు లుండినఁ గాదె తరువు?
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౫౨

# సుబ్బరాయశతకము.

గీ. ప్రాణ మున్నప్డె విడుచు ద్రవ్యంబు; బాంధ
వులును, మిత్రులు మసనంబుఁ బోవవిడుతు,
రఘముఁ బుణ్యంబె విడక తో నరుగుదెంచు;
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౧౩

గీ. పరఁగ నర్థార్థికడ బంధుగురుహితంబు,
లజ్జ భయమును గామార్థిపజ్జ నిలవు,
సుఖము నిద్రయు విద్యార్థి జోలిఁ బోవు,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౧౪

గీ. హెచ్చెను వయస్సు సుతున కం చొంచి మించి
పొంగుదురుగాని మనుగడప్రౌఢులంచుఁ
దలుగు టెఱుఁగరు తలిదండ్రు లరయలేమి,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౧౫

గీ. కాదని చివాటు లిడక వంకాయనాఁడు
కఠినశిక్ష లొనర్చి, టెంకాయనాఁడు,
బిడ్డమనసును మార్పఁబో గడ్డుగాదె;
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౧౬

గీ. మానముం బ్రాణముం దూచ మానుకొనినఁ
బ్రాణము లఘుత్వ మందుట మానరక్ష
ణమునకుం బ్రాణముల వీడి గమలయశులు,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ ౧౭

## ద శ

గీ. దశయె పూజార్హ మగుఁగాని తనువు గాదు;
పీఠమున నుండి కప్పముల్ పెద్దఁ గాంచు
నాతఁడె పదచ్యుతినిఁ దృణ మాదలేఁడు,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౫౮

గీ. పగ్ణమున నుండి గణ్యవైభవము నందు
తమ్ములపుటాకుఁదొడిమ; తద్దళము వీడఁ
జీపురున నూఁతప్పకుప్పను జేరుగాదె!
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౫౯

గీ. శ్మశ్రువున నుండువేళఁ గేశంబు పౌరు
షంబున కలంకృతికిఁ దానకంబ యగుచుఁ,
దొలఁగువేళను బూదినేఁ దొరయలేదు;
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౬౦

గీ. వెలఁదుక సుమంగలిగ నుండువేళ నెవరు
రాగ నర్థింతు రెల్ల, రా బాగు సెడిన
నింటివారేని కాన్పింప నీసడింత్రు,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౬౧

గీ. నిశ్చలత్వవిహీనాత్మ నెవరు నమ్మ
స్వేచ్ఛఁ జరియింపఁ గీడును జెందు నతఁడు,
కత్తిపై సాము వాని సంగాత మెపుడు,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౬౨

గీ. తనదుకార్యంబువేళఁ బాదములు పట్టు
నవల శిర మెక్కు నేతంబు నట్లు దుష్టుఁ,
డెఱిఁగి వర్తింపవలె వాని నెల్ల ప్రొద్దు,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౬౩

గీ. నీరు పల్లం బెఱుంగును నిజము దేవుఁ
డెఱుఁగు నని రిత్త యున్నసోమరికిఁ గష్ట
దశ ఘటిల్లుఁ బ్రతికియుఁ దలఁపఁబోము,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౬౪

## జామాత

గీ. గటికనే యల్లుఁ డన నది గంతు లేయు
నన్నచో నన్నిహంగులు నమరునట్టి
యల్లురను మంచివాఁ డుండు ననుట కల్ల,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౬౫

గీ. అత్త, యల్లుఁడు నద్దంబు నప్పువాఁడు
నగుదురు పిశాచతుల్యు లే యదనునందుఁ,
గ్రొత్తకోర్కుల వేసటఁ గూర్చుచుంట
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౬౩

గీ. అన్యదోషంబు లెన్న నెవ్వఁడభిలషించు
వాఁడు తనదోషము లెఱుఁగఁలేఁడు, దివ్వె
తనదుక్రీనీడ నెఱుఁగఁజాలనివిధాన,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౬౪

## మనుష్యశక్తి.

గీ. పుట్టుటకుమున్న నేర్వఁడే పోటరియును,
విని కనియు నేర్పుమై నేర్చి వివిధవిషయ
చతురుఁ డైనను గణనీయజనుఁడె యతఁడు,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ.

గీ. భ్రమయును, బ్రమాదమును నరవర్గమునకు
సహజములు గానఁ దా నెంత మహితబుద్ధి
యైన నిజదోష మెఱుఁగ లేఁ డనుట నిజము
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ.

## విద్యార్థి

గీ. ఆత్మసారంబు లేని విద్యార్థి యెంత
నేర్చినను గాని గురుబోధ నిలువ దింతె
చందనసమీపవేణువృక్షంబుపోలె,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౭౦

గీ. జడునకుం జేయుబోధ నిష్ఫలము సువ్వె
శ్రమమె మిగిలెడు; శర్కర యమితముగను
బోయ క్షారాబ్ధి మధురిమఁ బొడమఁగలదె?
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౭౧

గీ. కష్టముల కోర్చి శుశ్రూషఁ గర మొనర్చి
నేర్చు విద్యల మతిరాశి నిపుణు డౌసి,
తప్తలోహంబు నీరంబుఁ ద్రావుకరణి,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౭౨

## పండితుఁడు

గీ. పండితుఁడు పూజనీయుఁ డే మండలమున,
నధముఁ డెవ్వఁడో పూజింపనంతమాత్ర,
లేదు లోప మతం డనల్పకయశుఁడు,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౭౩

గీ. అధముఁడగులోభి పూజింప నంతమాత్రఁ
గలదె బుధునకు లోపంబు ? జలజబాధు
రత్న మాధుఁడు త్రోసిన రమణ సెడునె ?
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౭౪

గీ. కావ్యమంజూష సుకవిశేఖరుఁడు దాఁచి
యున్న సద్వస్తుమణులఁ బ్రసన్నబుద్ధి
నొసఁగి తనిపెడుబుధుఁడు పూజ్యుఁడు గాఁడె ?
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౭౫

గీ. అంబుధి బుధేంద్రుఁ, డంబుదం బగుఁ గవీంద్రుఁ
డింతియేకాన భేద మి ట్లెఱిఁగి యర్హా
విధుల బుధవరులను గౌరవింపఁ జెల్లు,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౭౬

గీ. కదనమునఁ గాండిశీకుఁడౌ కాశ్యపీంద్రు
మనుమసిద్ధిని విజయసామ్రాజ్యుఁ జేసి
కవుల కుపదేష్ట గాఁడె తిక్కనమనీషి ;
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ.

## సుబ్బరాయశతకము.

గీ. ఖడ్గధార లభింపఁగాఁ గానిజయముఁ
గవనధార లభింపఁగఁ గవి యొనర్చు
గజపతిం ద్రిప్పి పెద్దన కనఁడె జయము;
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౭౮

గీ. పారిజాతాపహరణప్రబంధరచనఁ
గృష్ణరాణ్ణృపుచిత్తప్రవృత్తి మార్చి,
యాల్మగలఁ గూర్చి తిమ్మన్న యశముఁ గొనఁడె?
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౭౯

గీ. భాషపై లోక మాధారపడుటఁ జేసి
భాష సృష్టించుటఁ గవీంద్రు బ్రహ్మ యంద్రు,
శ్రుతిఁ "గవిం కవీనా" మనుసూక్తి లేదె?
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౮౦

గీ. అన్యకృతములఁ బెక్కుదాహరణములను
దెల్పి యాత్మీయములఁ దృప్తిగొల్పి శ్రోత
మనసు రంజించి మరలించు ఘనుఁడు సుకవి;
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౮౧

## డాంబికదాత

గీ. గృహమునఁకుండి చేయఁగల్గినవి చేయ
వలసినవి మాని తీర్థయాత్రలకు నరుగ
డాంబికున కంకుఁ గల్గు ఫలంబు సున్న,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౧౨

గీ. పట్టెఁడన్నము విద్యార్థి పొట్టనేని
వేయనేరని దేబెలు వేలు ఖర్చు
పెట్టితిమి తీర్థములకన్న వట్టిమాట,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౧౩

## సత్యము

గీ. సూటు హ్యాటును బూటున్నఁ దోఁట లున్నఁ
గోట లున్నను ధన మెన్ని కోటు లున్న
మాటఁ దప్పినఁ గాలిగో ర్నాటి రాఁడు,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౧౪

గీ. దొరతనం బున్న విద్యల గురుత యున్న
కులధనము లున్న వేరెన్ని బలము లున్న
మాటఁ దప్పిన రోమంబు పాటి గాఁడు
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౧౫

గీ. వనధు లింకినఁ గులగిరుల్ వ్రయ్యలైన
ధరణి క్రుంగిన గ్రహములు దారిసెడిన
సత్యవాణియశంబు నాశంబు గాదు
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ.

గీ. యజ్ఞములు మేరువును రజతాచలంబుఁ
గామధేనువు సుధయు నొక్కెదెస, సత్య
మొక్క దెస నిల్ప, సత్యమే యొరగు సుకృత;
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౮౭

గీ. సతముఁ బతిదేవతకును సూనృతవచస్క
సకును జగములు దేవతల్ సకలభూత
ములును వడవడ వడకు వాంఛల నొసంగు,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౮౮

గీ. సత్యవంతునిప్రాణం బొసంగె శమనుఁ,
డుదయమందుట మాని దా నుష్ణరోచి,
సాధ్వులకు జంకిగా కొండు జాడ గలదె?
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౮౯

గీ. సుతునిప్రాణంబు రాజ్యంబు సుదతి యశము
నొసఁగె త్రైశంకికిని, శ్రమ మోర్చి సత్య
పాలన మొనర్పఁ జండకో పనుఁడు తపసి,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౯౦

## ధ ర్మ ము

గీ. తనయుఁడైనను దీవించుతఱిఁ దలంచి,
'ధర్మ మేవ జయతి' యనె ధర్మవేత్త్రి
సాధ్వి గాంధారి, దాన విశ్వనుతిఁ గాంచె,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౯౧

గీ. తనయుఁడైనను మఱి సహోదరుఁడె యైన
ధర్మచింతనవేళఁ దద్ధర్మదీక్ష
నిలుపువా రందెవరు కీర్తి నలఘుభంగి,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౯౨

గీ. దశగళుం డాగ్రహించుట దానఁ దనకు
ముప్పగు టెఱింగియును ధర్మమును వచించి
యశము నందె విభీషణుం డసురకులుఁడె
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౯౩

## అ ధ ర్మ ము

గీ. కలి నధర్మంబునకుఁ జాల బలము గల్గి
నట్లు దొలిఁ దోఁచుఁ దద్బలం బరయ నెండ
నడరు మృగతృష్ణలో జలం బట్లు నిజము,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౯౪

సీ. శ్రమ ఘటిల్లును గాక ధర్మంబు విడువఁ
జెల్ల, దద్దాన వృద్ధియు శ్రీ లభించుఁ
దెలుపఁబోరె 'ధర్మో వర్ధతి' యని బుధులు
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ.

సీ. కార్మొగులువోలె గాఢమై కానిపించు
కోటమంచున జల మందగూడనట్లు
ధర్మబలమున ఫలముఁ బొందంగరాదు ,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ.

## మాత

సీ. గర్భము ధరించుటాది రక్షణముకొఱకుఁ
బడినకష్టంబుల లిఖింప నుడువఁగామి,
మాతృఋణమును దీరుచుమనుజుఁ డెవఁడు
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ.

సీ. తనయునిం గాంచి స్నుషకరంబునను బెట్టి
కూతునిం గాంచి యల్లునిచేతఁ బెట్టి,
పైని నరసెడు తల్లి కెవ్వారు సాటి ?
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ.

## నీతిగీతములు.

గీ. మాతవాతికి వాక్కట్టు మంత్ర మగుచు
జననిస్వేచ్ఛకు గద్యమై తనరు బిడ్డ
చేత గర్హింప దా యమ్మచేత మేమొ!
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ.

గీ. యక్షప్రశ్నంబులకుఁ బాండవాగ్రజుండు
తగు జవాబిచ్చుచోఁ దల్లి ధరణికంటె
వ్రేగని వచించె దాని భావింపవలయు,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ.

## పిత

గీ. విద్యయు వివేకమున్ వంశవృద్ధి సుగుణ
సంతతి లభింపఁ దాఁ గన్న సంతతికయి
శ్రమల నందెడు పితఁ బోలఁజాలు నెవడు?
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ.

గీ. గురుగణంబుల నుత్తమ గురు డతండు,
దేవగణమందునం భాగ్యదేవుఁ డతఁడు,
తనువునకు నాదిమూలంబు తండ్రి సుమ్ము!
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ.

# సుబ్బరాయశతకము.

గీ. తాన పుత్రుండుగా నిజదారగర్భ
మందు మన జనించు టది నిక్క, మాగమంబు
నందు విన 'మొకో పుత్రనామాఽసి' యనుచు
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౧౧౩

## సోదరులు

గీ. దేహమున నంగకంబుల తీరుఁ దోఁప
నేకగర్భజులై సృష్ట్య మేకరీతిఁ
బ్రావిన సహోదరులకు భేదంబు గలదె ?
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౧౧౪

గీ. కటికిచేఁదునఁ దగు వేప కాయలైన
నేఁడు నొకకొమ్మనుం జనియించెనేని,
విడదు సంబంధ మనెడు నానుడిని వినుము ;
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౧౧౫

గీ. జాతకంబందు విక్రమస్థాన మనఁగ
సోదరస్థాన మగుటఁ దత్సోదరబల
వృద్ధి నిజబలవృద్ధియై వెలయఁబోదె,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౧౧౬

గీ దారకుమారు బాంధవులును మిత్రులును నానాప్ర
దేశదేశంబులను, సవిత్రియును పితయు
సహజనులు దొరక, రిది నిజంబు తెలియు,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౧౦౭

## సోదర

గీ. పుట్టిని ల్లభివృద్ధిని బొందకున్నఁ
దనకు రాఁబడి సౌఖ్యంబు తలఁగు ననియు
నైనఁ బుట్టింటిపోరు గొంచు నాముని ష్ఠ,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౧౦౮

గీ. పరితరంబుల వెనుకటివారి ముందు
వారిఁ దరియింపఁజేయును స్వగుణమహిమఁ,
గానఁ బుట్టంగవలయును కలికిమిన్న ;
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ. ౧౦౯

* *
*

## ఫలశ్రుతి

గీ. నీతిదాయక మీ కృతి నేల నింగి
చంద్రసూర్యులు గలదాక చదువు లెఱుఁగు
వారికరముల హృదయాల వ_ర్తిలవలె,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ.

గీ. బాణలోకాబ్జభవ శీతభాను సంఖ్య
నెసఁగు నాంగ్లేయసమ రచియించి యలఘు
కరుణ నొసఁగిరి కొంప్రంపుఁగవులభవ్యులు
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ.

గీ. శతకకృతినేత తాఁ జిరస్థాయికీ_ర్తి
మూ_ర్తియై సాధుహితపథవ_ర్తి యగుచు
శాశ్వతాశీర్ణవంశప్రశ_స్తి గనఁడె,
సుగుణసముదాయ పున్నయసుబ్బరాయ.



